వెనుకొకనాఁడు తాననుభవించిన భోగవిశిష్ట జీవితం
బును, తనుబొందు ప్రస్తుతపు ముప్పులఁదావిడి వేసిచూచినం
బొనరగ గాలిలోఁ గలిసిపోయెడి స్వప్నకథా విశేషమై
గనఁబడుచుండునంతఁ గులకాంతను మిత్తివరించె చివ్వనన్.

దగ్గఱకు జేరి కన్నీటిధార గురిసి
యెత్తిపాదిగింటఁజేరిచి మొత్తుకొనుచుఁ
దన్మయావస్థలోఁబడి తత్తరించు
భర్తచిహ్నాలఁ గడగంటఁ బడఁతిగాంచి.

కరముల మోడ్పుతో వినయకారుణదృక్కులస్వాగతంబు ని
బ్బరమున భర్తదుఃఖపరివర్తనగాధకు తావళంబుగా
గురిసి యనంతభక్తి రసకుల్యములాతనినామెతింప, సా
దరమునఁ బల్కె కట్టకడ దైన్యపువాక్కుల గాద్గదంబునన్.

కాలముదాపరించినది, కాటికి కేవలసన్నికర్ష మం
దాలయ మొందుఁగట్టుకొని యాశలుదక్కితి, యెప్పుడున్నదా
జాలముమేనుదాల్పులకు జచ్చుటపుట్టుట సిద్ధమింక, నా
జోలిమనంబునం దిడక సూనులదిక్కు మనంబు త్రిప్పుమా.

జీవితేశ్వర మన శ్రేష్ఠ జీవితంపు
బుప్పలతికల సుషమా విభూతి కలన
తప్త కాఠిన్య విషలవిత్రలకుఁ జిక్కి
కడకు విచ్ఛిన్నమయ్యెను కాలగతిన.

5

మరణపుదేవి న్యాయపరిమాణమెఱుఁగని మూర్ఖురాలు దు
ర్భర కఠినాత్మ! అక్కటా! విభాగమొనర్చెను మీకు నాకు సు
స్థిరమగు ప్రేమబంధములఁ జింత మరొక్కటి జన్మభూమి నా
మరణ సమాధిశయ్యలనమర్చెడి భాగ్యము నోఁచనందునన్.

ఏదియెటైనగాని యొక యీప్సితమున్ నినుగోరుచుంటి నా
థా ! దరిలేని యీబుడుతలందఱ నీకరమందుఁ బెట్టితిన్
గాదిలితోడ బెంచు మొకకష్టము వచ్చిన నీసడింపకే ?
నేదరులక్కటా ! తెలివినేరరు దిక్కుమరెవ్వరీవెగా !

ఏను వచ్చినచోటున కేగుచుంటి
నా కికేమియు దిగులు చింతయును లేదు
గాని, మిమ్మెన్నియాపదల్ గలసికొనునొ ?
కాల మెఱుఁగును, భూదేవి గాంచగలదు.

గట్టుచిక్కని మోదకంధిలో మనసార
నాటలాడించిననాటి ప్రేమ
కడగండ్ల నిప్పులగాడ్పులో త్యాగంబు
సమకూర్చ మొగ్గిన సమానశక్తి
నిజజాతికొఱకునై నెత్తురు బొటించి
పంతాన బోరిన బంటుతనము
ధర్మార్థమునకునై తనువు వ్రయ్యలుజేసి
యీఁబూనుకొన్న పేరీవి మహిమ

ఘనతరవిలాస రసతరంగముల నెక్కి
దడిసి బెదరక వీరమాతలకు జెప్పి
మురిసి పొక్కిపోవుచు స్వర్గభూములందు
బొడుకొందు నాథా ! నీదు పరమ చరిత.

నీవున్నను మరొక్క జన్మమున నున్మేషప్రభా సంపదల్
దైవాఱంగను నాంధ్రదేశముననే దాంపత్య బాంధవ్య సం
భావాతీతము లుల్లసిల్లగను జన్మంబెత్తి సంప్రీతితో
దీపింపంగలభాగ్య మెప్పుడొగదా ? దేదీప్యమానా కృతిన్.

ఘనతంజెందిన యాంధ్రవాఙ్మయపుథం కాఁగొట్టి మీసంబు ది
ద్దిన శ్రీనాథుని, నీవిధేయచరితన్ దెల్లంబుగా వ్రాయు డం
చును ప్రార్థింతును, గానియొక్కనుడి, నీచుండంచుస్వర్గంబు నం
దున భేదంబడిగల్గునేమొ యనిజెందున్ భ్రాంతినాయాత్మకున్.

పలువుర బందులన్ విడచి భాగ్యవిభూతిని గోలుపోయి కాఁ
పుల బలవద్విరోధమను మూసనుగ్రాగి స్వజాతి దుఃఖమే
యలవుననైన నాపుకొన నాఢ్యుల బాసటలేక కాననం
బులబడి గుందుచుంటిమి ప్రభూతవియోగముతాండవింపగన్.

మిత్తిమొత్తిడి కత్తెఱసత్తి నలిఁగి
దగ్ధమగుచున్న హృదయ పద్మమును నీవి
చార సూచనోపద్బుధ జ్వాలలు, ద్విగు
ణీకృతార్తినిగనుమార్చె నిక్కవముగ.

తీవ్రసతీవియోగ వితథీకృత సంహృత దుర్భరైక చిం
తావ్రణ మేరుభూధర విదారణ కారణదక్షతాది భా
గ్య వ్రతతిన్ గడించి కడగండ్లకు ధైర్యమునొడ్డి యేక ప
త్నీవ్రతమూను, ధీరులకు తేజ మదేగద? ధారుణీస్థలిన్.

పసుపుం గుంకుమ గాజుపూసలకు శోభంగూర్చునీరూపపుణ్
వసుధాగోళము, ప్రేమచంద్రికల దీవ్యద్ధస్తపుంబాడిపైఁ
బసఁగల్పించు సువాసినీతనువుతోఁ బ్రస్థానమై స్వర్గపుం
జెసకై పోవుట నాదుజీవితమ యెంతేధన్యమైపొల్చెడిన్.

స్వామికృపాకటాక్షములు చల్లగవీచిన నెప్పుడైన నీ
భూముల నెట్లొదాటి మనభూముల కేగిన; నాదుయస్థులన్
కామకగొంచుపోయి మన కాటితలంబున బాతిపెట్టుచో
దీమసమూని నీఋణము దీర్చను నోతును జన్మలెత్తగన్.

ప్రియుని కరమునఁ గరముంచి విడువలేక
కన్నబిడ్డల కరుణ బంగారు నీటఁ
గూర్మినభిషేకముం జేసి గునిసి గునిసి
తనువుఁ జాలించి స్వర్గంబు దరలిపోయె.

వారి యుపద్రవంబును నివారణఁ జేసెడివారు లేక కం
గారుపెనంగ, తల్లిమృతగాత్రము పైఁబడి యేడ్వగన్నులం
గారు కవోష్ణ బిందువులఁ గ్రాఁగిన గండశిలల్ ద్రవింప జా
గారము జేసిరెట్టులో? యొకానొక దుఃఖ చరిత్రమగ్నులై.

బుస దొఱంగిన నరుడు ప్రపూజ్యుఁడైన
నొక నిమేషము గీములో నుంచరనెడి
పలుకునకు సాక్ష్యమనఁ గళేబరము మన్నుఁ
జేసి రానిశి, విధి విధిఁ జెనయు నెవఁడు.

పంతతధారగాగురియు సాంద్రపు టశ్రుల దొప్పఁ దోఁగి యా
వంతయుఁదాళజాలని నెపంబునమూల్గుచుగూర్కుఁజెందుచున్
జింతిలి నిద్దురన్ విడచి చీదర బుట్టు నొడళ్లతోడ ర
వ్వంత సుఖంబులేక తెలవారిచి రెట్టులొ తండ్రి బిడ్డలున్.

ఔడు లంటుకపోయి మాటాడలేక
కాళ్ల తీపుల బాధచేఁ గదలలేక
భార్యపోకడ లాత్మలోఁ బ్రతిఫలింపఁ
బయనమునకు సన్నాహ మేర్పఱచు కొనియె.

మాతల్లి యేదని మారాము జేయుచు
నంకె వేయుదు రొక్క యడుగు నిడక
కడుపుజిచ్చున మేము కదలజాల మటంచు
మజిలి జేయుదు రొక్కమార్గమందు
నిఁక నెంత దూరంబు నేగగా వలెనంచు
బ్రశ్నింతు రొక్కట పాలుమాలి
మమ్మెత్తుకొనుమని మనవిజేయుచు నాప
సోపాలు బడుచుంద్రు సొక్కిసోలి

కడసు రాయని చిత్తంబు కలతబాఱి
యసురుసురుమంచును నుసురులన్ని ద్రావు
పడివిచార గుహాలయందుఁ బవ్వఁజు దీఱి
దిక్కుఁగనక యేకాకియై తేజ ముడిఁగి.

మానిని, దేవతాసతుల మంగళహారతులన్ ఫలంబులన్
గానుకలంది సంతత సుఖంబుల నందుచుఁ గూరుచుండగా
బూనకమైన సంసృతి సముద్ర తరంగము లీది యీది యీ
శాసనభూమినెట్లు కడఁగాంతునో? నాకిఁక మార్గమెద్దియో.

అనుచుకడలేని శోకదవానలమున
ధైర్యవర్ష ప్రసక్తినిదరిమి, చిన్ని
పాపలందఱిఁగొని దైవబలము కతన
రాజపురికేగె నుంత విశ్రాంతిఁ బడయ.

వారలఁ బురజనులారసి
పేరెంబులతోడవచ్చి పెనఁగుచు, మీదే
యూరని మీరెవ్వారని
సారెకుఁ బ్రశ్నింప నతివిషాదము తోడన్.

క్రిమికీటకాదులు క్రీడించుముఁకి కా
ల్వలచెంత వాసస్థలంబు మాకు
కంకాళములపైని గంతులువైచు భూ
తములు నిత్యములు మిత్రములు మాకు

ఆరోజు లీరోజులనక వాకిటను, మె
లగెడి పెద్దమ్మ బందుగగు మాకు
జీవితకాలంబు చెలఁగి దేహమునమ్మి
జీవించువృత్తులే సిరులు మాకు.

జాంబవంతుని వంశాన జననమొంది
పెద్దయింటివారను పెద్దపేరుమ్రోసి
మానవేతరమగు నంటరాని పేర
వగచి కృశియించు వెలివాడవార మేము.

వర్షములులేక పంటలు బండలేదు
బ్రతుకజాలక యిటు మేము వచ్చుచుండ
మధ్యమాయాడగూఁతురు మరణమొంది
జివికి మిగిలినవారితోఁ జేరినాను.

అనివచియించు వాక్కుల్ వినినంత నెసీసపుగొండలెన్నొ అక్కునఁ గఱిగించిపోయుగతి గొందలమందుచు నిబ్బరింప లేకను నెవరంత వారలు చికాకయి మోములు తెల్లవోవగన్ జనిరి దరిద్రరాయని విషాదపు గాధను చిత్తగింపకన్.

జనకుఁడేడ్గురు బిడ్డలు చాలినంత
కూడుదొరకక యాయూర గొప్పయింట
తనయులందు బుడగని జీతానికుంచి
హేమచంద్రపురంబున కేగిరంత.

కాటి సామీప్యమందు సుఖాము జేసి
యన్నమాపురమంతట యడుగు కొనుచు
బిడ్డలందఱఁ బ్రేమాన బెంచుకొనుచు
జీవయాత్రను నెట్టులోఁ జేయుచుండె.

కొండొకరేయికార్మొగులు కోడెవయస్సుఁబరాక్రమించి యు
ద్దండ తటిత్ప్రభాంగన గతాగతచర్యకు బొంగిపోవుచున్
గుండెలుగుబ్బటిల్లఁ బిడుగుల్ ద్విగుణీకృతమైపడంగ భూ
మండలమెల్ల వర్షమసమానముగాఁ గురియంగఁ జొచ్చినన్.

కూకటివ్రేళ్లతో విరిగిక్రుంగి గుభాగుభి గూలుచుండె న
స్తోకమహీరుహ ప్రకరశోభలు తుండెములై, శకుంతముల్
వాకలమూకలై తరఁగ పాన్పులపైఁబడి స్వర్గసీమ కెం
తే కనునీరు చిమ్ము చరుదేరఁదొడంగె భయానకంబుగన్.

ఆజడివాన దెబ్బలకు నాగగలేక విషాదమొంది ని
ద్రా జపదీక్షయందున విరామములేక సుఖించి మత్తులా
లేజవనంపు బిడ్డలను లేపి యొకానొకగోడక్రింది కు
త్తేజముడింగిజేర్చుకొంచెకుక్కనె మఱెద్దియు గానుపింపకన్.

నానినానిన గోడ పూనాదుతోడ
ధిమి ధిమీయనిమిగుల శబ్దించి కూలి
తండ్రియును దుగ్గియును దక్క తక్కువారు
మరణమొందిరి దుష్కాల మహిమ కలన.

కొంత తెఱపిచ్చి వర్షమాక్రోశమణఁగ
కాఱుమబ్బుల పరదాలు కదలఁబాఱె
చుక్కలు రవంత కాంతితో నక్కినక్కి
వెలుఁగ దొడఁగెను చీఁకటుల్ విచ్చిపోవ.

గోడుగోడున నేడ్చుచు గొణుకుకొనుచు
కష్టవాతావరణ మరికట్టలేక
కటికి కాదంబనీవృత కాళరాత్రి
మందె పేదకుమార్తె సాహాయ్యమంది
ప్రేత భూమికి గొంపోయె పీనుగలను.

తాఁకినయంతలోఁ దనువుఁ గజ్జగఁజేయఁ
జాలిన చలిగాలి దోలుచుండె
గడియ తీఱికలేని తడబాటు దోతెంచు
కుళ్ళుచిన్కుల వానగురియుచుండె
చేట నిప్పుకణాలు చెఱగుచు భయదంపు
గొఱవిదయ్యంబులు దిరుగుచుండె
భస్మపీఠంబుపైఁ బ్రాపంచికమునేలు
బూచులదొరమంట రేచుచుండె
వరుడు నక్కలుశవముల మురకబట్టి
గోలఁ జేయుచుబొందల గ్రుళ్ళగించి
కసరిపై దూకు గూబల వెస నదల్చి
తనివి దీరంగపలలంబు దినఁదొడంగె

జలిబిలియస్థిపంజరపు జీర్ణకుటీరకవాటమందు గా
ఢ్పులగిలిగింతకుం దలఁగిపోకమిణుఁగురు, బుఱ్ఱలంబలే
వెలుఁగుచు రాయుచుండెనొక వేయియుగంబులమించియాత్మశ
క్తులబలితంపుదీపికలస్తోమము, వింతభయాలగొల్పుచున్.
తీరనిజవ్వనంపుదొలుదీవులలంకలు పొంగిపార్ల క
న్నీరుస్రవించి. మైదువలు నెంజలిరాల్చినగాజుపూస క్రొం
దేరుల బస్పు కుంకుమము దిబ్బలుదిబ్బలునై తపింపగాఁ
దీరెను ప్రాణనాయకుల తీయని దర్శనభోగవాంఛతో.

ఒకవంకబీన్గుల నోర్పుఁతోఁ గొంపోయి
 డొక్కలై పాడెలుఁ దొల్లుచుండె
ఒకవంకశవముల వికలమనస్సుతోఁ
 గాడులుకన్నీటఁ గాల్చుచుండె
ఒకవంకతలపుఱ్ఱెలొడిగి ప్రకృతిదేవి
 నాట్యాలమాయకు నవ్వుచుండె
ఒకవంక పాతిఁబొమికల గద్దెలనెక్కి
 కుక్కలు పరిటీలుఁగొట్టుచుండె

అస్థికలబూదిరాసులయుంగలార్పు
పాతిఁతచరితలకడగండ్లబలుకరించి
చితులుమూల్గుచుతం గేఢుచెట్టులొకట
స్వాగతమిడుచుండె శవాలబందుగులకు.

కడకుచేయునదేమియు గానఁబడక
మూల్గుచేడ్చెడి దుగ్గని బుజ్జగించి
ధైర్యమొకకొంత హృదయపాత్రమున రేగ
ప్రతిఫలించెను నూత్నభావములు గొన్ని.

ఇచ్చోటనేగదా యేమానవుండైన
స్థిరసౌఖ్యములతోడఁ జిందులాడు
ఇచ్చోటనేగదా యేవిభేదము లేక
సమధర్మదేవత సంచరించు
ఇచ్చోటనేగదా యేయాటు దోషంబు
దీండ్రింప లేమికి దిగులునెందు
ఇచ్చోటనేగదా యేవిచారము లేక
పరతత్త్వభాగ్యంబు పంటపండు

భౌతిక శరీరమున నద్దుపద్దు లేక
యస్థిర విభూతి ఫలముల కాగ్రహించు
నరుల కీశుం డగపడు పుణ్యస్థలంబు
స్వర్గసౌఖ్యాల కిది సోపాన పథము.

ప్రతియామభేద భావము దెల్పు వేఁకువ
కోడిపుంజులమేలుకొలుపు కూఁత
శిలలుద్రవింపగ నెలుగెత్తి మృదుగాన
ముల బాడు ఖగదంపతుల రవంబు

పుష్పాడి దుమ్ములోఁ బొరలాడి ప్రకృతిని
రమియించు పవనాంకురముల దండు
తెలిఁగంటి పాటలాధరలు సొమ్మసిల ప్రమో
గెడు కంచుగంటల నుడులపాట

శాంతివిశ్రాంతి దాంతి పరిశాంత డోలి
కల నహర్నిశలు సుఖింపఁ గలిఁగి ప్రళయ
మంతకునునిదురఁజెందు పరిహార్ష మతుల
మేలుకొలుపవు కొంతరమించియైన.

కమ్మనిభావచంద్రికలఁగాసి జగంబు రమింపఁజేయు చి
త్తమ్ములఁ జిక్కుమంచు పరదాలనమర్చి దరిద్రదేవి హృ
ద్యమ్మగు నాంతరంగిక మహత్తరశక్తుల నార్పివేసి మో
దమ్మన సంచరించు సరదాలిట సాగవు దొమ్మిఁజేసినన్.

ఇది కాళిదాస కవీంద్రుని భావామృ
తముఁగ్రోలి మురిసిన ధన్యభూమి
ఇదికృష్ణరాయల యేపారు కీర్తికి
స్వాగతంబిడిన వజ్రాల నగరు
ఇదియె తిమ్మరుసు మంత్రీంద్రుని దర్శించి
జ్ఞానంబుగొనిన విజ్ఞాన పథము
ఇదెగదా రెడ్డిరాజేంద్రుల యీావి ప
న్నీటమునిఁగిన పున్నముల పంట.

రాయభాస్కర బలిజోగరాణ్మాపాదు
లస్తికల దర్శన ప్రాప్తియగుట కతన
జన్మసార్థకమయిన ప్రశస్తసీమ
యెట్టివారలకిది గనునట్టి ఫలము.

పుడమి ముసాపురిన్ గడపి భూరివిషాద కుటీరవాసముల్
విడిచి, గతించి మున్ననిన బీదలు శాశ్వత సౌఖ్యమందుచో
గుడువ మరేమి లేక యిటకుం జనుదెంచెడి వారి నెల్లరన్
బొడఁగని కంటినీటి తెలిముత్తెపు స్వాగతమిత్తు రోర్చుచున్.

బక్కచిక్కిన పేదవాని కన్నీటిలో
నవతరించెడి నంగలార్పు కీలి
కలుషంపుఁదనముతోఁ బులిపించు జాడ్యాల
యింతిబింకాల కన్నెఱ్ఱ పొగరు
బలుపుమై క్రీడించు కలిమి కన్గోనలఁ
బ్రభవించు మాయల వలపుటుచ్చు
మాత్రలో వలపించి మఱిరోఁతయనిపించు
ప్రకృతిగల్పించు విభ్రాంతి కృతులు.
దుఃఖసంతప్త హృదయ ప్రతోళియందు
బయలుదేరెడి యార్తరవంపు సెగలు
సాగనేరవ యిచ్చోట జపము తపముఁ
గడఁగి జేసిన కొన్నియుగాలకైన.

మరణమొకంటయున్నదను మర్మమెఱుంగక భోగభాగ్యముల్
పెరముగడించి, మైమఱచి పిల్లికి బిచ్చముబెట్టకుండ దు
ర్భరమతులై సమస్త ధనభావము వ్యర్థముసేయుచట్టి కా
పురుషసమాధిశయ్యలిట మూల్గుచునున్నవటంచు నెంచెదన్.

కురువింద మణులతోఁ గూర్చిన గొనబు సౌ
    ధాల చరించు నిద్రావధూటి
పునుఁగు కస్తురి గంధములసొంపు రాణింప
    హర్షించి కులుకు సౌఖ్యముల రాణి
తీరికవాడల తేరుపై నూరేగు
    రవసెల్లఁ గప్పి విశ్రాంతిదేవి
సంతోష వారాశి శయ్యలఁ గ్రీడించు
    చక్కఁదనపు నిరాశాచిరంటి

స్వర్గలోకము సౌఖ్య నైసర్గికపుఁ బ్రి
శస్త రామణీయకము విస్తారమెంతొ
గాని, తర్కింప నీ వల్లకాటి మహిమ
భూతల స్వర్గమేగదా ముదము గూర్ప.

ఇవి యెన్నిదేశాల నేలిన రాజరా
    జుల తలపుఱ్ఱలై వెలయునొక్కొ
ఇవి యెన్నియుద్ధాల దవిలిగెల్చిన మహా
    యోధులయెముకలై యుండునొక్కొ

ఇవియెన్ని యిడుమలనేని భరించిన
కష్టజీవుల పదగ్రంథులొక్కొ-
ఇవి యెన్నఁ డేఁకి నింత దానము జేసి
యెఱుఁగని లోభుల శిరములొక్కొ-
ఇవిమహోన్నత దేవదేవేశ యజ్ఞ
యాగకృతోన్నమ యాజి హస్తాగ్రములొకో?
పొంగుటేకాని కాటికిబోనివారు
గలరె యోనాటికైన జగంబునందు.

పినుఁగుబిగాదిమన్నియలు పేదలు సాదులుపంచభక్ష్యముల్
దినుచుసుఖించిత్పృప్తిఁగొనుధీరులు, కీర్తిగడించువారు వీ
రనకసమానశయ్య లిటనందఱికొక్కటిగానమర్చి నే
ర్పునభువిలేని ధర్మముప్రబోధముసేయు స్మశానమేగదా.

అవిజింతించుచుఁబుత్రగాత్రముల సమ్యక్ప్రీతినాలింగనం
బునుగావించుచుఁబొంగివచ్చుదుగదఁబుల్ వీడిపూడ్చంగబూ
ను నిమేషంబున అగ్రజన్ములటకెంతోమంది యేతెంచి వ
ల్దని మీకిచ్చుటతావులేదని బలేదండించిరుగ్రాకృతిన్.

పురిసెడునేలబిడ్డలను బూడ్చునునక్కట వల్లకాటిలో
దొరుకకపోయె, నియ్యెడిప్రతున్న పుటీదఱగాలివానతో
నఱిమెడియర్ధరాత్రము, దురూహ్యమునైననుమ్రింగజూచు దుఁ
ర్మరణ విచారసూచకసమస్యనునెట్లుల తప్పుకొందునో.

భారతభూమిలో వెతలభానిసవృత్తికిచిత్తగించి దు
ర్వారనికృష్టకష్టముల రాపిడిరథ్యలదొంపులేని క
న్నీరుస్రవించు పంచములనే కడజాతికి లేదు కాటిలో
దూరరవంతజాగ, కటా! దుఃఖభరంబులు పూర్వధర్మముల్.

సామరస్యవిహీననిస్సార భరత
ఖండ దుర్వారచరిత విక్లాంతమరసి
దేవుఁడా! యంచు తుదకు ప్రత్యేకభూమి
కరిగెబిడ్డలశవముల బరువుతోడ.

కడకుం బుత్రవియోగ సంజనిత దుః
ఖ ధ్వాంతనేపథ్యముల్
సడలింపన్ సుతులార! మీజనని ప
జ్జన్ శాశ్వతానంద మే
ర్పడవర్తింపుఁ డఖండవైభవముతో
స్వర్లోకమందంచుఁ దాఁ
గడయాశీస్సులొసంగి పూడిచెను దు
ష్కాలంబుఁ జింతించుచున్.

ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

# తృతీయాశ్వాసము

ఆ పురంబునఁ గట్టియ లమ్ముకొనుచు
చాలిపోయిన పూట యాచకుఁడునగుచు
దొరకకుండిన నాఁడు తుందుడుకు లేక
స్థిర యశఃకాంత మదికి బ్రసిద్ధుఁ డయ్యె,

ఆసలే కాంతవియోగసంజనిత దుఃఖాక్రాంత నిస్సారరో
దసి గర్భాంతరసీమఁ జిక్కుకొని యాతాయాత జీవాత్మతో
ససివోనాఁడెను, బిడ్డలేవురొకటన్ స్వర్గీయ భాగ్యంబునం
దెసనార్జించిరి దుగ్గి దప్ప మఱివేరే లేరు దిక్కెవ్వరున్.

చలిగాలి జోదులు ములుకులు వర్షించు
        శాటిహీనాంగ రాజ్యంబుపైన
చెమ్మట ముత్యాలు చిందులాడి హసించుఁ
        దనరు సోయగపు సౌధమునుగెలిచి
జఠరాగ్నిక్రొవ్వేఁడిజడివానవర్షించు
        జిగురుప్రేవుల కాంతి జగతిపైన
మురికిధారల సత్తిమురియుచు విహరించు
        నారోగ్యదేవిపైఁ నలుకఁబూని
తలమెలుచుకొని యంటులుగట్టి రేఁగు
నిఘద పెన్నెఱిగుంపులనడుమ, నీపి
నరుజ దండులు గొనబు నన్నాయినూద,
బేను దంపతులూరేగుఁ బెనఁగుకొనుచు.

నిద్దురమంపునందు జననీ జననీయని కల్వరించుచున్
బెద్దగనేడ్చి యట్టిట్టులుఁ బేరముఁబట్టుడు, వంతతండ్రి దా
నద్దిరపాటుజెంది తనయా! తనయా! యని దేవులాడుచున్
ముద్దులదుగ్గినెత్తుకొని ముచ్చటజెప్పును నూఱడించుచున్.

నాలిజచ్చిన నరముల నట్టనడుమ
నల్లఁదాఁపుచు మృత్యువు నక్కినిక్కి
పొంచికోఁజూక వేష మెత్తించుచుండెఁ
గీడు తనకేమి తాఁగలిగించినాడొ?

అతడు మామూలుగా దుర్గమాటవులకు
వంటచెరుకులఁగొని తెచ్చు వాంఛనరిగి
కట్టియలుఁగొట్టఁ గొడ్డటి గతితొలంగి
కాలిపైబడి గాయంబుఁ గలుఁగఁజేసె.

దిక్కుమఱెవ్వరిన్ గనక తేకువఁజెందుచుఁకుంటుకుంట తా
నొక్కఁడె బాటబట్టుకొని యోపికపెంపున గారునెత్తురున్
గ్రుక్కలుగ్రమింగుచు న్దుఃఖించునుబిడ్డగతిన్ దలంచుచున్
ముక్కుచుమూల్గుచింటికొక,మోస్తరుగానడచెంచెసోలుచున్.

గీమునకేగుదెంచుసరికే మఱిదప్పెను, ఘుర్మకంకణ
గ్రామము చుట్టుముట్టి పదరంభణ సౌఖ్యములాచరించె,మా
రాముని మిత్తితన్వలచి, రమ్మనుచుండెను,దృష్టిమాంద్యమై
కామనమంతరించె, పలుకన్ దననోటికి మాటరాకయున్.

కనులు మూతలువడిపోయె, గంటినీటి
సోనవర్షించె, దుగ్గిసాలయుఁగలిగె.
గద్గదస్వరమేర్పడె, కాయమంత
కాందిశీకతచే వణకంగఁజొచ్చె.

జనకుని గ్రమ్మికేగడి విషాదమగుత్తుల తాడనంబుచే
గనలికృశించి తెప్పిరిల్లి కన్నులువిప్పియు ధైర్యమూని చిం
తను విడనాడి కారణవిధంబు గ్రహింపను చిత్తమందు, తాఁ
గునియుచు దేహమున్ నెమకి గొడ్డలిదెబ్బగనెంచితిన్నగన్.

పైటకొంగున విసరును బలుకరించుఁ
బలుకకుండిన లోలోనఁబరితపించి
చెలఁగి శైత్యోపచారంబు సేద దీర
నాచరించును నెంతేని యాశతోడ.

తగు సపర్యలొనర్చుచుఁ బాగులుదుగ్గి
దుఃఖగీతి కాలాపసందోహరసము
కర్ణరంధ్రంపు తంత్రుల కడకుఁ బ్రాఁక
మేల్కొలుపు పాటలోయన మేలుకొనియె.

చింతిలుదుగ్గిపై సమ్మృత శీతల వాఃకణ వర్షపాతపున్
దొంతరనింపి హస్తమున దువ్వి కవుంగిటఁజేర్చి, తాపమా
వంతయు లేనివానివలెఁ బైకినటించుచు లోనఁగుంది తా
నంతిమవాక్కులన్ నుడువయత్నమొనర్చెను కంటినీటితో.

తనయా ! నాకొఱకై యనారతము సంతాపాబ్ధి నిర్లీనవై
దినముల్ పుచ్చకు, లిబ్బితామసపు టుద్రేకంబుఁజూపించె, దా
రిన మీయమ్మ గతించె, హీనతను వేఱే దిక్కు లేకిట్టు ల
య్యెను దేశాంతర సీమఁ గాలగతి నిన్నీదారి బట్టించునో.

ఆవులు వోఁపుచుఁ శిశులకన్నముఁ బెట్టవటన్న సామ్యమే
కేవలసిద్ధమయ్యె, మనకే యిటువంటివి వచ్చెనంచు నీ
వేవముఁజెందఁబోకు మనహీనపుజాతులనెందఱెట్టు లే
తావులు లేక చింతిలి వితాకును జెందుచునుండి రెల్లెడన్.

పరరాజులకుఁ దలవంపులుగాఁగ ర
త్నాలఁ జిమ్మిన మేటి దానభూమి
పౌరుషభావనా ప్రతిభాధికపుటుగ్గు
పోసి పెంచిన గొప్ప పుణ్యమాత
విజ్ఞాన భిక్షను విశ్వధాత్రికి బంచి
సంతసించిన మహాజ్ఞానరాశి
ముల్లోకనాథులు మురిసి యాచనసేయు
బహుధనంబును గొన్న భాగ్యశాలి
వైరి జనముల రానీకఁ బాఱఁద్రోలి
సేసలొసగుచు గంగాది సింధువులను
సనుఁగు బిడ్డలఁగసిన హిమాద్రి వెలయు
భరతఖండంబుగద మన వాసభూమి.

వీరులగన్న మాత, పృథివీతల సన్నుతితో మెలంగి దో
స్సారవిశాల భాగ్యములఁ జాలఁగ జూపినగన్న తల్లి వి
ద్యారసపూరిత ప్రతిభనంది చరించిన యస్మదాంధ్ర భూ
మీరమణీయతా మహిమ మెవ్వఁడు వర్ణనసేయ జూచెడుకా.

పౌరుష సంపదన్ ప్రబలి పండిన మేటియశస్సు లోన ము
మ్మూర్తులు హాయిఁజెంది, యసమానపరాక్రమశక్తియుక్తులం
బోరి జయించి, నిష్కపటబుద్ధిని నాల్గుశతంబు లేలి రీ
భారతవర్షమాంధ్ర నృపవర్యులు, పౌరులు సన్నుతింపగన్.

శాలివాహను ప్రతిష్ఠా జయస్తంభాలు
    జేజేల బెదరింపఁ జేయునాఁడు
చోళభూపాలుర శూరప్రతాపాగ్ని
    విశ్వమంతయుఁ గాల్చివేయునాఁడు
కృష్ణరాయల రత్నగేహాలఁ దెనుఁగు ఢ
    క్కానిక్వణము భోరుకలఁగునాఁడు
పల్లవాధీశు ప్రాభవకీర్తి చంద్రాత
    పద్యుతిదిక్కులఁ బ్రాఁకునాఁడు
ఆంధ్రజనముల దివ్యతేజోధికంపు
వితతధాటీపటిష్ఠైక విలసనంబు
పొంగిపొరలెడినాఁడున్న భోగమహిమఁ
దలఁచుచుండిన గుండియల్ జలదరించు.

కాకతీయులసత్కీర్తి కాంతగన్న
వలపుకానుపు వజ్రాల బాలికలకు
నవ్యతేజోమయంపు కట్నాలనొసఁగి
ఆంధ్రవిష్ణుఁడు కల్యాణమాచరించె.

గోదావరి పుణ్యకుల్యంబు విజ్ఞాన
మధుసస్యరత్న సామగ్రినొసఁగి
పెన్నాస్రవంతి చిప్పిలువాఙ్మయామృత
శీకరంబుల నెగఁజిమ్మిచిమ్మి
తుంగభద్రానది తొలకరించినకైత
వెన్నముద్దలతిండి భిక్షఁబెట్టి
కావేరిమాధురీ గానసుధానిధిఁ
భరతఖండానికిఁ బంచిపెట్టి
కృష్ణవేణమ్మ సిసలైన కీర్తిఁదెచ్చి
దిశలవెన్నంటిచాటి పందెంబులొడ్డి
ఖ్యాతివజ్రాల వెన్నెలగద్దెపైన
లోకమేలుచునుండె తెలుంగురాణి.

తురకభూపులు స్వాధీనపఱచుకొన్న
భరతభూమిని రాయలు ప్రభవహించి
తిరిగి మోడించినంతకు దెనుఁగుదేశ
మనఁబునాదులేర్పడె సమంజసముగ.

ధనధాన్యంబులకిక్కువై యశము సంధానించు నిబ్భారతా
వని కేలాటి యవస్థగల్గినదొ లాభప్రాప్తిలేకుండఁగా ?
మనకాలాటి విపత్తులబ్బుకొని, అమ్మా ! సర్వసంఘంబులం
దున నైచ్యంబునఁగుందుచుంటిమి సిరోదోదూయమానాత్మతన్.

వ్యాసమహర్షి వేదముల నల్లికులాలకు లేనిపోని యా
యాసముఁదెచ్చిపెట్టెననియందురసత్యము ! నిక్కువంబె ! తా
రాసికి నాల్గుజాతులని వ్రాసెఁగదా ! మఱినీచజాతిగా
గాసిలుచున్నయెదవ తెగన్ సమకూర్చిన పెద్దలెవ్వరో.

అదియట్లుండఁగనిమ్మిటీవల విపర్యాసప్రభానీత సం
పదలో మర్త్యులు, దస్యులార్యులనియన్ భాగంబులై పోవఁగా
సదసద్బుద్ధులనేర్చి యార్యులు సదాచార ప్రహర్షంబునన్
దుదకా దస్యుల నీచులంచు వెలిగా దూరంబునందుంచగన్.

ఆచారంబులయందు, నాగరికతా న్యాయప్రబోధంబులన్
వాచామాధురి గౌరవాభ్యుదయ సంపత్సంఘ విద్యోన్నతిన్
నీచత్వంబువహించి, ధర్మవిధులన్నేర్వంగఁబోలేక, యి
ట్లీ చండాలురనంగఁ జెల్లితిమి యెంతే దుఃఖ నిర్మగ్నతన్.

మనలో మాట నిజాన కీమనుజవర్గంబందు రెండేగదా
కనఁగా జాతులు పోతు పెంటియని, కాఁగా, లెక్కలేనన్ని యెం
దున సంకల్పితమర్త్య జాతులని యెంతో సంశయంబంది, ప్ర
శ్నను గావింతునదేమొ కారణము ? నానారీతులై దోచెడిన్.

దినకృత్యాల కొఱంతఁ దీర్చుటకునై ధీమంతులూహించి క్రొ
న్నన మూర్ఖాళికి వృత్తిభేదముల విన్నాణంపు టుద్బోధనం
బునుగావింపఁ గ్రమక్రమంబుగఁ గులంబుల్ గూడ సంకల్పము
య్యెనుగానీ ; కులభేద మాదిఁగలదే? యొండె విమర్శింపఁగన్.

వృత్తులు పెక్కుభంగులు భువిన్ గలవందున, గొప్పగొప్ప స
ద్వృత్తులఁదొమ్మిఁ జేసియవధిన్ గడియించినవారు, నైచ్యపున్
వృత్తులఁజేయ గొందరనివేదనఁ జేసిరి, చేయువారలన్
బొత్తిగ నీచులంచు వెలిఁబుచ్చిరి ! ధర్మమదెట్టిదో సుతా.

తక్కినజాతులన్ని యొకతట్టున వాసముసేయుచుండి, లో
చిక్కినమాలమాదిగల చీఁకటిగోఁతినిఁ గూలఁద్రోసి న
ట్లక్కున నంటుదోషపు దురాగ్రహశక్తులతోడ గ్రుమ్మియున్
బెక్కుగు నీర్ష్యతోఁదరిమి వేసిరి యూరిబయళ్ళ చెంతకున్.

ఏనాఁడో, పురిఁబాపినారలదిగా నెన్నో శతాబ్దాలు కా
లానంజిక్కియు గూలిపోయినవి లీలావైపరీత్యంబుగాఁ ;
గానీ! హీనుల దిక్కుమ్రొక్కుగని సంగాతాన రక్షింపగా
బూనంబోరుగదా దయానిధులు సంపూర్ణానురాగప్రభన్.

శవమాంసాదుల నారగించుటనుశస్త్రంబంచు తా మొప్పియున్
వ్యవధాశక్తి హితంబుచెప్పిరి, దురభ్యాసంపు ఘట్టంబులం
దవమానంబొకయింత లేదనియు వ్యాఖ్యానంబుసృష్టించి మా
నవజాతిన్ గడఁజేర్చినారధికు లన్యాయాన తోఁబుట్టులన్.

ఏకార్యాల గడంగిచేసినసరే యేమద్దియుంచాడకే
యూకొట్టక్ సరిపోయెగాని, దయతోనోదార్చి దుర్మార్గపుం
జోకిళ్ళాచరణంబు మానుఁడని యుద్బోధించి సద్వృత్తిచే
నేకీభావముఁగూర్పనేరరుగదా! యీనాఁటికైనన్ బుధుల్.

ఆరోగ్యంబది యాదిమాంధ్రులకు లేదన్నట్టి వ్యాజంబుఁగాం
డారోపించిరి, లోకసమ్మతపు ధర్మార్థ ప్రబోధంబులే!
లేరే; సత్కృతి నాచరింపగలవారిన్ సన్నికర్షంబునం
దారాలేక సమాన భావమత సౌఖ్యంబిచ్చు ధీరోత్తముల్.

గతజన్మాంతర కర్మయోగమని వక్కాణింతురెంతేని మా
గతియేమంచును ప్రశ్నసేయ, సరిబల్కంగారణంబందమిన్
చ్యుత సంస్కారులు నిర్దయాకరులు తద్యోగంబు సర్వత్రసం
గతమౌనన్న దెఱుంగరింతకును దుష్కాల ప్రభావంబునన్.

పనులనుబట్టియే మనుజవర్గమునందున నీచగౌరవం
బనగను రెండు ముఖ్యమగు హక్కులు గల్గెను; యట్టినీచపుం
బనులఁబరిత్యజించి గరిమన్ దులఁదూగుచున్నహీనులం
చనెడి విరుద్ధబుద్ధియొకఁ డన్వయమంటుచు రాఁదొడంగెడిన్.

భూములులేవు, గల్గినను బొత్తిగఁ బండవు, లచ్చియున్ననో
గీములఁ దొంగిచూడను, వకీళ్ళనుబెట్టి సవాళ్ళు వేసినన్
బేరిముడీవో సన్నిప్రభుఁడు పొంగలిసిద్ధికి నడ్డుబాటుగా
బాములఁగూర్చుగొన్ని, పగఁబట్టిన పన్నగరాజ మోయునన్.

వినుమొక ధర్మసూత్రము వివేకమతీ! మనలో రమారమిం
బౌనరఁగ నేఁడుకోట్ల జనముల్ గలరందురు, మేలదృష్ట రే
ఖను గలవాఁడొకండయిన క్ష్మాతలమందున బుట్టఁడయ్యెవం
తునకయినం బదుండ్రివలెఁ, దోయజజన్ముని ధర్మమెట్టిదో.

ఆరయుగభాగ్య విద్యలను నంది విశాల సుఖానుభూతివి
స్ఫారయశస్సుతోఁ బెరిఁగి భారతభూమిని మాలమాదిగల్
గూరిమితో మెలంగుటను గొప్పకులంబుల వారి కండ్లలోఁ
గారము వోసినట్లగును గాంచుకొలందిగ వృద్ధిఁ గోరమిన్.

ఏకీభావము లేక సద్గతికి తావేలేదు, దుర్వారని
శ్రీకానీక జగంబు గర్భమున నిర్లీనంబునై, దాస్యమం
దాకల్పంబు నడంగియున్న మనకన్యాయంబుఁగల్పించు తిం
తా కాలుష్యము లంతరింపవుకదా! ధాత్రీస్థలంబుండగన్.

మన హస్తకమలమందణఁగియున్నది తెలుం
గుల జాతకము వ్రాయుగొసబు కలము
మన నెత్తుటూటయం దినికి యున్నది రాజు
లకు జయంబిచ్చు వాలముల సమితి
మన ధర్మబుద్ధిలోఁ దనరియున్నది వదా
న్యుల సాహసోద్రేక యోగపటిమ
మన త్యాగమహిమయం దణఁగియున్నది దేశ
భక్తులు వెలుఁబుచ్చు పరమశాంతి

మన ప్రశస్తవితత ఘర్మకణములందు
ప్రతిఫలించెడి దోశ్శక్తి భాసురంబు
భావిభాగ్యోదయంబునై భరతభూమి
సిరుల సేకూర్చి మిన్నయై చెలఁగుచుండె.

పురుషాంతంబులు దాటిపోయినకతంబునఁ భారతక్షోణిలో బరవంజెందుద కంటుజాడ్య విషదుర్వారోగ్రవృక్షంబు విస్తరశాఖా ఫలపుష్పపత్రముల సంతానపరిభాసిత దుర్భరమై చెన్నలరంగ, ఖండన మొనర్పఁ తాదె జ్ఞానాసిచేఁ.

నరశత్రువై, పుట్టనడుమనిప్పులుఁ గ్రక్కు
విసపునాగులుగుంది బుసలుమాను
స్పర్శనజ్ఞానసంభ్రమము లేని శిలాళి
చలియించి ద్రవియించి కలఁతజెందు
మనుజవాసనఁ బాఱఁగినిసిగర్జించు ము
వ్వన్నె మెకము రోషభరతనుఱుకు
ప్రకృతి కాంతామణి పసదనంబు హసించు
పసరుటాకులు మూర్ఛ భావమొందు
ఆదిమాంధ్రుని నెమ్మనంటి భువన
మునకసహ్యతాపదిమితిఁ బొడమఁజేయు
నంటురోగపు నిట్టూర్పులలమికొన్న
మాత్రలో శిలీభూతమై మతులుదప్పి

కులమతభేదభావముల గుర్తెరవంతయు లేక సృష్టిమ
ర్త్యులసృజియించెనందురదియోగ్యమెగావుత, నట్టిదైవముల్
బలువురతోడఁ బూజసలుపన్ గలభాగ్యము లేకపోయె దే
వళమున, భూమిదేవి, పరివర్తనకేమని శిక్షఁబంపునో.

భావిభవంబు మానవుల పట్లగలుంగుట ధర్మమంచునుం
గోవిదులందు రట్టిది నిగూఢమటందురు కొంద, రుండుచోఁ!
సేవల పంచమాధములగీముల లక్షభవాలకైననుం
బోవుగబుట్టగూడదిఁక బుట్టుటగిట్టుట దోషభావమే.

జనకువాక్కుల కూఁతురువిని మఱింత
కంటనీరులు కాల్వలై కడలిఁజేర
యడిగె, ప్రభువరుండైన న్యాయాంతరమున
మనలఁ దిలకించి రక్షింప మనసు లేదె?

మనదేశంబును హూణభూపతులు సంపాదించిపాలింపగాఁ
గనమున్నారుశరత్తులైనను మఱొకన్ నిమ్నజాత్యావనం
బునకుంబూనరదేమియందువో? తలంపుల్ లేమిచేఁగా దస
జ్జనయోగంబులు భంగపెట్టెననివాచాయుక్తిబోధించెదన్.

ఒకనూల్పోగునఁగట్టి దేశములనెంతో శౌర్యధైర్యాల జి
కక శాసించుధరాతలేంద్రుఁడొకచోఁగాంక్షించియత్నింపమా
మకదుర్భాగ్యము బాసిపోవునదె? అమ్మా! తాఁబ్రియత్నింపలే
నికతంబున్ మనజాతికిట్లగుములెన్నొగల్గె గష్టప్రదన్.

నిలువన్నీడ, వసింపజాగ, తిన పానీయంపుటాహారపుం
గలవం బెంతయు లేనిజాతియని సత్కారాన మన్నించి వి
ద్యలఁ జెప్పించిరె? కొల్వులిచ్చిరె? మఱేతద్రాజకీయంబునన్,
గలనైనన్ గననోచకుంటిమిగదా? తన్నాథుసాహాయ్యముల్
ఎక్కడసీమయందో జనియించి వసించెడి హూణరాజు మా
చిక్కు గనంగలేదనియు తేపకు తేపకు నేడ్వకుంటె, ప్రా
ద్దెక్కినదాది రక్తపు రసేతువు బీల్చెడియుగ్రజాతు లిం
కెక్కడ దాగినారు, మనకీగతి జూపని నిర్దయాత్ములై.

అమెరిక దేశవాసులు, మహాత్ములు కొందఱు క్రీస్తుసిల్వపై
న మరణమొందిఁ జిందిన నసర్గళరక్త మహాప్రవాహమం
దు మునిఁగి త్యాగశీలురయి దొడ్డగఁ జేసిన దైవసేవనీ
చమతుల బాగుఁజేసెను విషాదపరంపర లంతరింపగన్.

జనకు గన్నుల గురియు బాష్పాల దుడుచు
చడిగ్గ, నిట్టూర్పుజెందుచు నార్తి బొడమ
మనల రక్షించి ముదమార మనపునట్టి
దాతలెవ్వరు గలుఁగలేదాక మరేమి?

కలుఁగర యేమిపుత్రిక! యొకానొక సామెత భారతోర్విలో
శిలలుద్రవించి దానమును జేయు నటంచును రాణజెంది భూ
వలయమునిండెఁ దద్యశము, భారతభామిని మోదబాష్పముల్
గులికిస్రవింపగా దిశలు కూరిమియుయ్యెల లూగుచుండగన్.

భారతదేశమందుగల బాధ్యతలన్నిట వెన్కఁజిక్కి యు
న్నారని నిన్న మొన్నట సనాతనధర్మ వివర్జితుండునా
పూరుషుఁడొక్కరుండు మనపుణ్యభువిన్ జనియించిగాంధియన్
పేరున బోరుచుండె, జయభేరులు మ్రోతజగాలునిండఁగన్.

అమ్మహాత్ముని యుద్బోధమాచరింపఁ
పరమభక్తులు కొందఱుబయలుదేఱి
త్యాగము వెలార్చుచున్నారు ధరణివణఁక
రక్తపుంగాన్కలన్ సమర్పణముసేసి.

వీరనాయికవై సుంతవిసువుఁగొనక
మనకులోద్ధరణకయి సమస్త రాష్ట్ర
ములఁజరించిపోరాడు ప్రపూజ్యనగర
సీమలను వీలుపడినవీక్షించుచమ్మ.

ఒకమహాత్ముఁడు మననాటనుద్భవించి
హరిజనోద్ధరణార్థమై యసువులొడ్డి
విశ్వదాతయనఁగఁబొందెబిరుదు, కాశి
నాథనాగేశరాయఁ డనంతదృష్టి.

తెలుఁగుగడ్డకువన్నెఁ గలిగించి భాషోష
ధులఁబోసి పెంచెమాధుర్యరాశి
ప్రపంచకమితోడ బందెంబులొడ్డి ర
త్నాలఁజిమ్మినమేటిదానశీలి

శ్రీరామునకుఁ దారిజెప్పి పున్నెముఁగొని
పేరుమోసిన పెద్దపేరటాలు
రాయలంతటి మహారణవీరుఁ బ్రేమించి
వియ్యంబులందిన వీరమాత
ముసలితనమున సంసారమును త్యజించి
పెత్తనములేక నిచ్చలు పేదవడియు
కుములుచును చెప్పఁలు వినుకొండపురిని
దర్శనము సేయు కన్నీటిధారనాపి.

అరగలేదు భాస్కరమహాప్రభుదానసుధాస్రవంతు లిం
పారఁదదన్వయోద్భవనితాంత గుణోన్నత భాసురుండువి
ద్యారసపూరితుండును, సుదారుఁడు రాఘవ సౌహృదంబులో
నీకలెత్తిపొంగిజవుకెత్తగఁజొచ్చెఁ దెనుఁగు భూములన్.

చేకుఱుబన్న మాపుటకు శీర్షమునొడ్డి స్వజాతి వ్యాజ్యపుం
బోకడలందునిగ్గి, పొలివోవనికీర్తిఁ దెనుంగు దేశమున్
వీకఁ జొరంగంజేసి, జయభేరినిమ్రోసిన బీరుసేడి మో
షేకవిసార్వభౌము నభిషేకముఁబొందుమ శాశ్వతంబుగన్.

అర్థుల ప్రార్థన నిత్యము
వ్యర్థముగాకుండ మేటివరములనిడి ప్ర
త్యర్థుల కగోచరంబయి
వర్ధిలు గద్వాలకరుగు ప్రభుదర్శింపన్.

కులుకుంబూత పసిండిగద్దియపయిన్ గ్రొంగ్రొత్తతేజంబుతో
గొలువుందీరి శనైశ్చరక్రియల కాక్రోశించి, దర్బారులో
వలమోదంబున దానఘంటికల శబ్దస్తోమమున్ మ్రోసి భూ
తలమున్ బాసిన రాజచంద్రమణిసీతారాముధ్యానింపుమా.

ఆదిలక్ష్యాంబ యనఁగనయ్యాధిపుమహిషి
ఖ్యాతి వజ్రాల నేటేటఁ గానుకలిడుచు
బీదలను, సత్కవీంద్రులఁ బెంచుచుండు
నమ్మహారాణి దర్శన మవసరంబు.

ఒకనాఁడు విద్వజ్జనోచిత దర్శనో
త్సుకత డోలికలపైఁ ద్రుళ్ళితూఁగి
ఒకనాఁడు సత్కవి ప్రకరవాగమృతాబ్ధి
యలలశిబికల పర్యటనజేసి
ఒకనాఁడు రాజేము నీపు కీర్తికన్న
స్తోత్రాభిషేకాన దొప్పదోఁగి
ఒకనాఁడు మంగళ ప్రకట ప్రశాంత ని
నాద విభూతి కానందమొంది

భూతల స్వర్గమోయన ముదముఁగూర్చి
ఖండఖండాంతర ఖ్యాతిఁగాంచి జీర్ణ
మై మిగిలిన హంపీక్షేత్ర మరసిపొమ్ము
కృష్ణరాయల ప్రతిభను గీర్తిజేసి.

ఆనరపాలుఁజెట్టి గడియఁ జనియించి శిరంబునెత్తెనో
గాని, తనంతఁదానెయు కత్తిని వీడెడినంతదాక త
న్నే నరనాథుఁడేనియు జయించి యెఱుంగడు, పేరువిన్న మా
త్రానవణంకి, భీతిలిపరారయి దాగిరి కొండలోయలన్.

అదె తెలుంగులయుగంబతులిత వైభవా
భ్యుదయము నార్జించి మురియుకొఱకు
అదె-యాంధ్రుల యుగంబు యశము వజ్రము లేరి
కోట్లలోగాలించు కొనుటకొఱకు
అదె తెలుంగుల యుగమఖిల దేశాలశౌ
ర్యపతాక మెత్తి పరాక్రమింప
అదె యాంధ్రకవుల మహాయుగమెందు భా
షాక్షీరములఁ గ్రోలి సంతసింప

పట్టినదియెల్ల బంగారు ప్రతిమలగుచు
కులుకునవ్వుల పువుగద్దెఁ గొలువుఁదీఱి
మీసముల గోటదిద్దిన మేల్మియుగము
వెడలిపోయెను కృష్ణభూవిభునితోడ.

స్థిర సత్కావ్యవిశాల హర్మ్యముల నుద్దీపించి భాషావసుం
ధర నిర్మించి సుభావదీపికల సంధానించి సంతోషమే
దుర డోలాళుల హాయిగా మురిసెడిన్ దుర్భాక (శ్రీ)రాజశే
ఖర విద్వత్కవిసార్వభౌముని యశఃకాంతామణిన్ జూడుమా.

కవితాసరస్వతీకవి సార్వభౌమాది బిరుదముల్
గల కవి వీరమౌళి ;
విశ్వప్రశస్త పవిత్రవీరవరేణ్యరాణా ప్ర
తాప సద్గ్రంథకర్త !
దేశభక్తిస్ఫూర్తిదీక్షతోఁ దనదు నుద్యో
గంబువదలిన దొడ్డవాఁడు !
అలకళాపరిషత్తు హాటకవజ్రకోటీర
మర్పించిన వీరసుకవి !

బహుళరసవత్కృతుల వ్రాయు బ్రహ్మ మౌని !
సూర్యవంశమహాకవిసోముఁ డనగ
దనరు మారాజశేఖర ధన్యమూర్తి
దర్శనమొకంటగావింపు దప్పకుండ.

తనదుసాయంబునొందని సంస్థ దేశమం
దొకఁడైనఁ లేని మహోపకారి
కవిసార్వభౌమసత్కవులకు స్వర్ణ కో
టీరంబులొసఁగునుదాత్తచిత్తుఁ
డడగకేగాని తన్నడిగిన సర్వ స్వ
మైననిచ్చెడు వదాన్యప్రభుండు
ధనదోపములు వైశ్యజనుల నింతటిదొడ్డ
వారు లేడను కీర్తివరలు ఘనుఁడు

కవుల విబుధుల, నర్థుల మిత్రులబ్రేమ
నూని పోషించుచో నెమ్మిలేని చేయి
వీరిదని పేరు వడసె చుండూరు వంశ
విధుఁడు వేంకటరెడ్డిని వేడ్కఁగనుమ ?

మననాగేశ్వరుమాఁబుదానగుణ
సంపన్నుఁపు సింహాసనం
బునఁగూర్చుండి నిసర్గహేమమకుటంబున్
దాల్చుచున్ పేదలా
జనులన్ బ్రోవ, ధనంబొసంగు
ఘనుఁడాజవ్వాజిలక్ష్మయ్య పా
వనసంస్థానముగాంచు మొక్కట
మనఃపద్మంబురంజిల్లగన్.

కల్లూరి సుబ్రాయ కళ్యాణకీర్తిని
బంగారుపూలతో భజనజేసి
రొద్దము రాజయ్య పెద్దఱికంబును
వజ్రాలమాలతో ప్రస్తుతించి
అశ్వత్థనారాయణాఖ్యు ప్రభావంబు
పన్నీటి జల్లుతో పలుకరించి
కోటిరెడ్డి సచివకోవిదుత్యాగంబు
క్రొంజాజిపూలతో కొలువుదీర్చి

ప్రతితదుర్భాక కృష్ణ విద్వత్కవీంద్రు
ఘనతఁగొలిచి, చిత్తూరు నాగయ్యగాన
రససుధాస్రవంతులయందు రాణకెందు
తెలుగుకీర్తిని చరితల బలుకరించి.

అఖిలభారత చర్మకారాది సభల
కాధిపత్యప్రసూనంపు హారమంది
వితత సత్కీర్తి వీధులవిఱ్ఱవీగు
పండితాఖండలుఁడు పరవస్తుదాసు
యభినవాశీస్సు భాగ్యంబులందుకొమ్మ.

పింగళి లక్ష్మీకాంతము
మంగళమయమగు కవిత్వ మాధుర్యంబుల్
బొంగుచు గ్రోలుచు ప్రభ వే
భంగులకీర్తించుమమ్మ పావనదృష్టిన్.

తేట తెలుంగునీటి తెలితేనియబాఱెడి పెన్న గట్టుపై
నీటుగ గొల్వుదీరి గణనీయ కవిత్వ ప్రసక్తితోడము
ప్పాటలు హాయిఁజెందిన ప్రపూజ్యుఁడు తిక్కనపల్కు బోటితో
నాటలనాడి భారతము నల్లిన సింహపురంబుఁజూడుమా.

కనుమచోళసుతా! వదాన్యగుణవికాసుండు నిర్భాగ్యులన్
గని రక్షింప ప్రశాంతపుందపము గాంక్షన్ జేసి యచ్చంపు కీ
ర్తినిగాంచెన్ బెజవాడ వంశభవుఁడై శ్రీరామచంద్రప్రభుం
డన ఖండాంతర సీమలందు, బహుళానందాన ప్రార్థింపుమా.

తనయోజనా మగ్నతను జూపుధీరత
శనిదేవు హృదిఁదాకు శరముపోటు
తన హార్ష పరవశత్వముఁ జూపులే నవ్వు
తెనుఁగు రాణిమకుటమునకు వన్నె
తనకరుణారసత్వముఁ జూపుచిత్తంబు
సిలుగులు సెందు బీదలకు ఫలము
తన మహత్తరదీక్షతను జూపుసంసేవ
లాంధ్రజనాభ్యుదయానికండ

తనమహాద్భుత వితతమేధా విశేష
పరిణత శ్రీమహారాజ్యగరిమఁ బెంప
నఖిలజనవర్ణనీయుఁడై యసముగాంచె
నమ్మహాత్ముని దర్శన మాచరింపు.

దివ్యజ్ఞాన పూర్ణుఁడు తిక్కవరపు
రామరెడ్డి మహామహాప్రథితకీర్తి
కన్యకాదర్శనంపు భాగ్యప్రధాన
విమల సౌధాల విహరించి వెడలిపొమ్ము.

అస్పృశ్యతా జాడ్యమంతరింప నితాంత
విక్లాంతములఁ బొందు వీరవరుఁడు
హరిజనోద్ధరణార్థ మసువు లర్పింపను
దలకొని పోరాడు త్యాగమూర్తి

సత్కవీంద్రాళి వాచామాధురి గ్రసించి
పసిఁడి కాన్కలిడెడు ప్రభువరుండు
తనగడ్డ బానిసత్వముఁ దొలగింప రు
ధిరము నొసఁగుచున్న ధీవరుండు

పరుల కష్టాలఁ గన్నార పరికరించి
కంటనీరులు రాల్చెడి ఘనచరిత్రు
ప్రథిత శేబోలపట్టాభిరామరెడ్డి
దర్శనశుభంబు నీకు యత్యవసరంబు.

సరి వేపలి వంశోద్భవు
దరయగ విజ్ఞానపూర్ణుఁడతులితకీర్తిన్
వరలెడు రాధాకృష్ణున్
మరువక దర్శించిపొమ్ము మానితభక్తిన్.

తనమనోజృంభిత దాతృత్వజలధిలో
స్నానంబులాడెయాచకులనేక
తనమహావిమలమేధాశక్తి కాంతిలో
జిగురుపట్టెనుశుద్ధచిద్విభూతి
తనయుపన్యాస విద్యాప్రబోధోర్మిలో
తృప్తిఁజెందెను హలాణదేశమంత
తనశాంతికరుణాప్రధాన పాలనము న
ర్థించెరాజేఁడుకీర్తిపడంతి

తనకుశాగ్ర బుద్ధీంద్రియ ఖనులవెడలు
జ్ఞానరత్నాలదేశదేశాలబంచి
తెల్గునేలకువన్నెను తెచ్చినాడు
నమ్మహామహుదర్శనమభిలషింపు.

కీరితికన్నె లేఁతపసజిల్గడఁ గ్రువ్వినచంపకాలసిం
గారపు జాళువాపసిఁడిగద్దె శిరంబునఁ గొల్వుఁదీఱి, పొం
గారుముదంబు, నర్థుల హృదంతమెఱింగియుఁ బంచుచున్న దు
ర్వారుడు తూములూరిశివరామవదాన్యుని ప్రజ్ఞ జాటుమా.

సద్గుణోన్నత నైజ భాస్వచ్చరిత్రుఁ
డాత్తజనరక్షణపు బిరుదాంచితుండు
పండితాఖండలుడు ధీరవరుడు భట్టి
ప్రోలు సూర్యప్రకాశ ప్రభునిదలంచు.

తనఖడ్గధాటికాంధ్ర యశోరమామణి
యర్పించె తెలిముత్తియముల కాన్క—
తనవిక్రమస్థిరతకుఁబొంగి జయలక్ష్మి
దయచేసె పట్టుజల్తారుపాగ
తనవదాన్యతకుఁబ్బి తనరిభారతమాత
గురియించెరతనాలక్రొత్తవాన
తనమహోన్నతికి స్వాంతము చిగిర్చిప్రకృతి
యొనిపె నివ్వాళి గంధాక్షతలను

విశ్వరంగంబుపై బొమ్మవిఱచినిలిచి
కత్తిఝుళిపించి వార్థులకలతపఱచి
తెలుఁగుతల్లికి మోదంబు తొలకరింప
కీర్తినార్జించినాడు దిగ్దేశములను.

పాయకవిశ్వనాథకుల పావనమూర్తి, దయాళుసత్యనా
రాయణ సత్కవీంద్రుని పురానగదర్శనమాచరించి నీ
కేయదియాప్సితంబో ? యదియేమియుజంకక వేఁడు కొమ్మనీ
కాయనచేతనైనవఱకడ్డముఁజెప్పకు చేయుదానికిన్.

తెలుఁగు నెత్తురుఁబోసి తేజంబు వెలిగించి
కండరాలకు యుద్ధకథలఁ జెప్పి
తెలుఁగుమాటల తేనెతీపిని జుబికించి
జ్ఞానశక్తికిఁ గవనంబుసెప్పి
తెలుఁగు టుగ్గునుబోసి కులికించి తనువుకు
దేశాభిమానంబుఁ దెలియఁజెప్పి
తెలుఁగుదాన జలంపు తేటను ద్రావించి
మదికి వదాన్యతా మహిమఁజెప్పి

ఆంధ్రజనయిత్రి బ్రహ్మాండమైనప్రేమఁ
దెలుఁగు బయల నూరేగించి తేజమొంపఁగి
తనకు కవిరాజ బిరుదప్రధాన గరిమ
మన్ననముఁజేసె నాంధ్ర సామ్రాజ్యమందు.

ఆనంద జనితనవ్య కవిత్వాంపువార్ధి వీ
చీడింభకులతోడఁ జెలిమిఁజేసి
దేశీయపదముల దీయందనపుకమ్మ
పుప్పొడి దుమ్ములోఁ బొరలియాడి
పసనిగ్గు జగ్గుల భావాధికపు పూల
మెత్తని సెజ్జపై మేనువాల్చి
కులికించి బరువెత్తు గ్రొంగ్రొత్త నడకల
తొలుకారు మెఱుపులతో వసించి

అగ్రగణ్యత నార్జించి యాంధ్రవాఙ్మ
యంపు సింహపీఠిక పయి నధివసించి
ప్రతిభఁ గాంచిన తనదు కబ్బపుఁబడంతి
దర్శనమొనర్చు మొకసారి దప్పకుండ.

మన దౌర్భాగ్యముఁదప్పద్రోయుమనిసమ్యక్ప్రీతిరత్నాదిచం
దనగంధాక్షతలిచ్చి, మూప్పాలకు బ్రాణంబొడ్డి, నిప్పచ్చరం
బనుబ్రార్థించుచుత్యాగమూర్తియయిసంపూర్ణాత్మనర్పించిమిం
చిన శ్రీగూడూరిరామచంద్రవిభు సచ్ఛ్రీయుంబు నర్థింపుమా.

ప్రథిత వేంకటాద్ర్యప్ప భూపాలవరుని
దర్శనముసేయు, సిలుగులు తారసిలిన
నమ్మహాత్మునివంటి దివ్యస్వరూపి
కానరాడెందు భవదీయ కాంక్షఁదీర్ప.

నాగేశరాయు విజ్ఞానంపుమధువుల్
ప్రతిఫలించిన పండువంటిమనసు
భోజరాజేంద్ర ప్రబోధామృతపుటేరు
కులికిమోసెత్తిన కోవిదుండు
కృష్ణరాయల మహాకీర్తిశౌర్యములతో
వియ్యంబులందిన వీరవరుఁడు
రఘునాథరాజేంద్ర రసికతాబ్ధిసదాన
రత్నాలనేరిన ప్రథితయశుఁడు

అమ్మహాత్ముని సంస్థానమద్ధిజనము
లిసుకజల్లినరాలక నిసలుపవలు
మూఁగియుందురు, నీవటబోయివేడఁ
గూర్మినభిషేకమునుసేయుఁ గొఱఁతలేక.

జయపురమేగు, దూరమని జంకక మార్గమగవ్యగోచరం
బయినమహాటవీతతి, భయంకరశైలనికుంజ నిర్ఝరీ
మయమయి, పక్షిదంపతి సమర్పితకూజితనాట్యగీతి కా
ధ్యయనమునై తనర్చు, కనులారఁగగాంచుము శీఘ్రమే సుతా.

ఆపురమేలు సద్గుణ విహారుఁడు విక్రమదేవవర్మ భూ
మీపతి సత్కవీంద్రులకు మించిన కానుకలిచ్చు, నర్థి సం
తాపపుటగ్ని నార్చును సతంబు విచారమొనర్చుచుండు, నీ
వాప్రభు దర్శనోత్సుకము నందిన శాశ్వత ధన్యవే సుతా.

క న్నీ టి క బు రు

వా తెఱవిచ్చినన్ మధురవాక్కులవర్షము, చ్ఛాస్త్రుల్లసద్ధు
ష సమోష
హేతుకమైనప్రేమ, గగుఁరింపులనవ్వు, హితానుగుణ్యముం
శేవి
బూతపసిండివన్నె, బొలుపుం బ్రసరించు ముఖారవింద వి
స్మిత వినిర్మలాత్మయును విక్రమభూపతి కగ్గలంబగున్.

కాలవశాన సీతనిజకాంతుని బాసిన బెట్టిదంపు దుః
ఖాలనుమూటఁగట్టి, కడగండ్లగడించిన కానపైఁడి చూ
లాలులఁగాంచుచాపయి సరాసరి దాపున కొండపల్లి గో
పాలదయాస్వరూపుని దివాణముచేరుమ నిర్భయంబునన్.

అమ్మహాత్ముని హృదయంబున దొఱుకాదు
కరుణాభిషేకంబు మురువుదాల్చి
అమ్మహాధీరు దృగంచలాలు స్రవించు
వీక్షణ పీయూషవృష్టిఁ దోఁగి
అమ్మహారాజేంద్రు హస్తాలు గురియించు
బంగారు జల్లులఁ బవ్వళించి
అమ్మహాదాత సత్యాలాపము వెలార్చు
శాంతి మకుటము శీర్షమున దాల్చి

ఘనతరానందరస తరంగములదూఁగి
అర్థిజనములు సౌఖ్యప్రవర్ధమాను
లగుచుఁ బెంపొందుచున్నారు దిగులుబాసి
యమ్మహాత్మునిజూచి మాటాడిపొమ్ము.

ధీరుఁ డుదారనైజ గుణదీప్తుఁడు, సత్కవిపోషకుండు, త
న్నారసి మ్రొక్కు పేదల సమంచిత నిస్తుల కామితార్థసం
భారపరంపరల్ గురియమానిత మార్దవచిత్తమూను కా
భ్యూరియుమామహేశ విభులోగిట కేగుము సంతసంబునన్.

అమ్మహాదానశీలున కన్నగారు
వరవదాన్యుఁడు, బ్రహ్మాండ భాండమంత
కీర్తిగంధంబు నించిన శివనుభూపుఁ
బుణ్యసంస్థాన మరయగఁ బొమ్ముబిడ్డ.

కవితాలోకము సంస్మరింపగల సత్కావ్యాల వ్రాయించి ప్ర
భవ మొప్పన్ గృతిఁబొంది, తత్కవులుసంభావింమనాశీసులన్
భువినార్జించి, యశోరమామణికిఁ, బూవుంగుత్తులర్పించు సం
స్తవనీయుండగు రామకృష్ణవిభుఁ బాదాబ్జాల సేవింపుమా.

హరి రామలింగశాస్త్రిని
మరువక దర్శింపవలె గుమారీ ! విద్యా
భరితుండాయన హరిజన
వరములఁ దీర్పాగమేటి ప్రాపకుఁడుసుమీ.

కమ్మనికైత కప్పురపు గాడ్పుపటాణుల గొల్వదీటి, మో
దమ్మువిగిర్ప, కీర్తివనితామణి నిస్తులశస్తగంధ తో
యమ్ముల హారతిన్ మునిఁగి, యభ్యుదయంబునసార్వఁజేసి దే
శమ్మునఁ బేరుమోసిన ప్రశస్తగుణాఢ్యుకు నిక్కువంబుగన్.

ధీరుఁడు దేశభక్తుఁడు విధేయుఁడు సత్కవిశేఖరుండు వి
ద్యారసపూరిత ప్రతిభనందిచరించెడి జ్ఞానవేత్త, క
న్నీరులరాల్చి బీదలవినిశ్చలబుద్ధిని ప్రోచుదాత, స
ద్వీరవరుండు కోటగిరి వేంకట కృష్ణవిభుణ్ తలంచుమా.

కట్టమంచికులీనుఁడు కవివరుండు
బహుళమేధావి విజ్ఞానవార్థి, యతి ద
యాళు రామలింగారెడ్డి యధిపుచెంత
విన్నవింపుము మామకవిప్లవముల.

తెలుఁగుజెండానెత్తి దేశదేశంబుల
గెలుపుకాంతలగొన్న వలపుకాడు
తెలుఁగువిజ్ఞానంపు దివిటీలవెలిగించి
ప్రతిభచాటించిన పండితుండు
తెలుఁగుమేధాశక్తిధీరత్వమునుజూపి
చరితలోమున్గిన సాంద్రయశుఁడు
తెలుఁగుకవనముతోఁగల దేశములమీఁద
పండెంబులొడ్డిన ఫంటగాడు

శౌర్యవిఖ్యాతిభిక్షుల జగతికొసఁగి
ఆంధ్రవిశ్వవిద్యాలయ యాధ్యక్షపదవిఁ
ప్రబల రామలింగారెడ్డి ప్రభువరేణ్యు
బుణ్యసంస్థానమరయగా బొమ్మ్మతల్లి.

సుకుమారుల్ గవిచక్రవర్తులుఁ జగచ్ఛోభాయమాన ప్రభా
వకసింహ్రుల్ సుగుణాఢ్యశేఖరులు విద్వద్వర్యసంస్తుత్యులుం

ప్రకటింపంగల క్షత్రపుంగవుల దివ్యద్దర్శనప్రాప్తిచే
సకలాశీర్వచనంబులం బడసి హర్షంబందిపొమ్మా సుతా!

సూతక్కి రామశేషయ
భూతలనాథునియశంపు పుణ్యావఘాటీ
పూతచరిత్రమ్మొక్కట
పాతముగాగని భజించి సరగునఁబొమ్మా.

ఆధునిక కవిత్వంపు హర్మ్యములమర్చి
భావదీపిక కాంతుల ప్రజ్వలించి
ఆయతయశంపు తూగుటుయ్యాలలూఁగు
దాయప్రోలు సుబ్బకవి వరాలబొందు.

కాలవాహిని మాయభంగములఁ జిక్కి
చరితలో మున్గి కన్నీరు గురియుచున్న
కొండవీడ్పురి రెడ్ల యుద్దండదుర్గ
సీమ, నవలోకనంబును జేసిపొమ్మా.

తెలుగుందల్లి కనుంగు బుత్రులయి యుద్దీపించి భాషాబ్ధిలో
పల శ్రీనాథమహాకవీంద్రు కవితా ప్రాశస్త్యభావంపు టు
య్యాలలఁదూఁగి, ప్రభావిరాజితులునై యేపారి భూలోకముల్
బులిపింపంగల రెడ్డిభూపులయశంబుల్ శాశ్వతానందముల్.
వారివదాన్యతామహిమ, వారి విశాలగుణానురక్తి సం
భార పరంపరల్ జికిలిపట్టిన వేమనపద్దియాలుగా
మారి, ప్రశాంతమై కవికుమారుల, వాక్కులవీణెలందు నిం
పార బవిత్రమయ్యెను దిగంగన శాశ్వతమోదమందగన్.

శాంతి సామ్రాజ్యంబు స్థాపించి వెడలిన
గద్వాల భూపుని గద్దెయందు
రసికుండు బెజవాడ రామచంద్రారెడ్డి
ప్రభువరేణ్యుని తలవాగయందు
తిక్కవరపు రామధీశాలి గురియించు
చల్లందనపు వీక్షణములందు
రామలింగారెడ్డి రాట్పాల భాగాన
మండనంబగు పుట్టుమచ్చయందు

కడకు కత్తుల బావిలో గలసిపోయి
చితులలో రేగు మనరెడ్డి కుతల పతుల
రాచతేజి, వదాన్యతా ప్రభలమహిమ
ప్రతిఫలించె దిగ్దేశముల్ పండిపోవ.

నాయకురాలి మేటికదనంబున బాలుని నెమ్మనంబులోఁ
బాయలుగట్టిపొంగిన ప్రభావపరాక్రమ వీరగాథ దీ
ర్ఘాయువుఁబొంది శాశ్వత విహారమొనర్చుచు నాగులేరు సౌ
ఖ్యాయతి రూపమెత్తినది, యన్నదిఁజూడుము గన్నులారగన్.

అచట కనతి దూరంబున నద్రిచయము
గానగావచ్చుసమ్మ, నాగార్జున,డను
పండితోత్తముఁడందు స్థాపనముఁజేసి
బౌద్ధ మతమును శిల్పంబుఁ బ్రబలఁజేసి.

పదివేలుంబయి శిష్యబృందములకున్ బద్మాల్గువందల్ విశా
రదులౌ పండిత సద్గురూత్తములుమీఱన్, బౌద్ధధర్మాలతో

నుదయోదంచితశిల్పిశాస్త్రమును, నాయుర్వేదవిద్యాప్రభఁ
జదువఁ నేర్చినపుణ్యభూములవి హర్షప్రాప్తి వీక్షింపుమా.

భారతదేశమందుఁగల బాలను లేమఱిగాక యొందరో
కూరిమితో విదేశముల కుఱ్ఱలునచ్చటికేగుదెంచి, వి
ద్యారసపూరిత ప్రతిభనంది ప్రశస్తపుభోగ సాధ సం
చారమొనర్చినారలు యశస్సు తెలుంగుల వాటకిచ్చుచుఁ.

అనుడుజనకుని సలహాలవిని మఱింతేఁ
బాగిలి, మనజాతిమఱియెట్లు దుగదముడిఁగి
వన్నెవాసిని గడియించి పదుగురివలె
బ్రతుకుదురటంచు ప్రశ్నింపఁ బలికె తండ్రి.

గాంధివలెఁ బోరులాడెడు ఘనులనేకు
లుద్భవించి దేశముల మహోగ్రులగుచుఁ
బోరి స్వాతంత్ర్య భాగ్యంబు మనదముఁగూర్చు
వఱకు మనజాతి యాగచాట్లు బాయవమ్మ.

అని పలుకుచున్న తండ్రికిఁ
దెలిగ్రుడ్లుంబడుచునున్నఁ దెఱవయు దుఃఖా
విలమతిఁ బైఁబడి యేడ్చుచు
దెలివి తొలఁగె, దండ్రిబోధ తెలివి ఘటించెఁ.

[illegible] ర్వము సంపూర్ణము.

———— ————